17 శ్లో॥ భవానీ! భవానీ! భవానీ! త్రివారం,
హ్యూదారం ముదా సర్వదా యేజపన్తి,
నశోకో, నమోహో, న పాపం, న భీతిః,
కదాచి త్కథంచి త్కుతశ్చి జ్జనానామ్!
(కదాచిత్, కథంచిత్, కుతశ్చిత్ - జనానామ్!)

**అర్థము :-** "భవానీ! భవానీ! భవానీ!" అంటూ ఆ జగన్మాతను ముమ్మారు (మూడువేళలా) భక్తి శ్రద్ధ - శరణాగతి ఆనందాలతో ఎవరైతే జపిస్తారో, వారికి - ఎన్నటికీ, ఏ విధంగానూ, ఎవరివలనా, శోకం, మోహం - పాపం, భీతి అనేవి ఏవీ కలగవు గాక, కలగవు!)

ఈ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో లానే వారి ప్రతి స్తోత్రమూ మంత్ర, తంత్ర, యంత్ర, భక్తి ప్రపూరిత, శరణాగతితో నిండిన మహానిధులు! వారు రచించినస్తోత్రాలు చదవటానికీ, అర్థం చేసుకోవటానికీ మన ఈ జన్మచాలదు. ప్రతిస్తోత్రం వారి అనుభవసారంలో నుండీ, వారి తపశ్శక్తిలో నుండీ, ఉద్భవించి - వేద సమానమైన ప్రతిపత్తి కలవి అవి పారాయణం చేస్తేచాలు, ధ్యాన సమాధి సాధించినట్లే! ఈ "సౌందర్యలహరి" వారి స్వానుభవములనే మణుల సమాహారము కూడా! మనం ఆ జగద్గురువుల అడుగుజాడల్లో నడచి వారి ఈ "సౌందర్యలహరి" భక్తిగా పారాయణం చేస్తేచాలు, వారు స్వయంగా దర్శించిన జగన్మాత - జగత్పితల దర్శనం - మనకూ లభిస్తుంది, కుశంకలూ, కుయుక్తులూ వదిలి పారాయణం చేసి తరిద్దాము. చివరగా, ఆదిశంకరాచార్యులవారు, తమ పద్నాలుగు మంది - మణి పూసలల్లాటి శిష్యులనూ, తమ అద్వైత మత ప్రచారకులుగానూ, గ్రంథప్రచారకులు గానూ నియమించి, వారినెవరినీ తమవెంట రావద్దని శాసించి, వంటరిగా, మహాప్రస్థానానికి హిమాలయాలకు వెళ్లిపోయారు!

శిష్యుల బంధం చివరిదశలో, మోక్ష పథానికి అడ్డుకా గలదని భావించిన ఆ పరమగురువు, తమ శిష్యులకు తమ ఆధ్యాత్మిక శక్తిని ప్రసాదించి - నిర్మోహత్వం, నిరాడంబరత్వం, నిశ్చలతత్వంతో - మహాకవిత్వ (సరస్వతీ) స్వరూపుడై తన "ఉత్క్రాంతి" (మరణం) అతి గోప్యంగా సాధించారు! వారు భౌతికంగా లేకపోవచ్చు, కానీ, వారి ప్రతి స్తోత్రములో, ప్రతి పలుకులో స్వచ్ఛమైన నడవడికలో - అక్షర రూపులై ఈ భారతావనిలోనే గాక, యావత్ప్రపంచంలో చిరంజీవులై, చిరయశస్సు పొందినవారై, వారి ఏస్తోత్రం ఎలా చదివినా ఆ భక్తుల హృదయాలలో చిరంజీవులుగా,పరమగురువుగా నిలిచివున్నారు. ఎన్నటికీ నిలిచేవుంటారు!

"మాకు గురువుదొరకలేదు! గురు భోధ పొందకుండా ఏ పూజ అయినా ఎలా చేయగలం ?" అని బాధ పడ్తుంటారు చాలామంది అలాటివారందరూ, ఆది శంకరులను మించిన పరమగురువు మరొకరు లేరని భావించి, వారి ఏకలవ్య శిష్యులుగా మారి, వారిస్తోత్రాలు కంఠస్తం చేసి, హృదయస్థం చేయగలిగితే చాలు! గురు భోధ దానంతటదే లభ్యమౌతుంది ఆస్తోత్రాలలోని ఆచార్యవాణిగా!

ఈ చివరి 11వ అధ్యాయంలో జగద్గురువు 35వ శ్లోకంనుండి 41వ శ్లోకం వరకూగల ఆరు (6) శ్లోకాలలో షట్చక్ర వివరణలో శివశక్తుల సమైక్య రూపదర్శనం, చేయించారు ఈ అధ్యాయం పారాయణం భక్తి శ్రద్ధలతో చేసిన వారికి, నానావిధ కఠిన రోగములు ఉపశమిస్తాయి భూతప్రేత పిశాచ, గ్రహ బాదలు తొలగిపోతాయి, దుస్స్వప్నములు రావు సకల ఉదర రోగములు శాంతిస్తాయి నూరవ (100 వ) శ్లోక పారాయణం వలన సకలకార్య సిద్ధి, జయము కలుగుతుంది

శ్రీ చక్రపూజ రోజూ సాంగో పాంగంగా చేయలేని వారూ, వీలుకానివారూ, శ్రీ చక్రాన్ని పూజించటానికి (అనవరంగా) భయపడేవారూ, లలితా సహస్రనామస్తోత్ర పారాయణం చేయగలిగిన వారూ, చేయలేని వారూ, ఇలా ఎవరైనాసరే, రోజూ "సౌందర్యలహరి" అన్ని శ్లోకాలూ (100 శ్లోకాలూ) గానీ, లేక ఒక్క అధ్యాయం ప్రకారం కొన్ని శ్లోకాలు గానీ భక్తి శ్రద్ధలతో పారాయణం చేయగలిగితే, సాంగోపాంగంగా శ్రీచక్రార్చన చేసిన ఫలం పొందగలరు.

జగన్మాత అపార కరుణ కలగాలేగానీ, మనం పొందలేనిది అంటూ ఏమీ వుండదు అందుకు మనం చేయవలసిన దల్లా భక్తి శ్రద్ధలతో కూడిన పారాయణం

జగద్గురువుకు మ్రొక్కి - తప్పక పారాయణం చేద్దాము రండి! ఆ జగన్మాత కృపకు పాత్రులమవుదాము రండి!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"భవానీ సౌందర్యలహరి"

రచన పవని నిర్మల ప్రభావతి

అంకితం

శ్రీ మాల్యాద్రి లక్ష్మీనృసింహ స్వామి దివ్య పాదారవిందములకు భక్తి ప్రపత్తులతో, అంకితం.

రచయిత్రి,

పవని నిర్మల ప్రభావతి



## రచయిత్రి రచించిన యితర ఆధ్యాత్మిక గ్రంథములు

- ☆ శ్రీరామాయణ రసవాహిని
- ☆ శ్రీ భాగవతామృత కలశం
- ☆ శ్రీ సుందరకాండ
- ☆ అవధూతతో అనుభవాలు
  (మొగలిచర్ల శ్రీ దత్తాత్రేయ స్వామి చరిత్ర)
- ☆ శివభక్త చరితామృతము
- ☆ శ్రీ లలితా సహస్రనామ సర్వస్వము
- ☆ శ్రీ షిరిడీ సాయినాథ భాగవతము

Printed at Swamy Offset Printers, Gandhi Nagar, Vja-3. ✆ : 578211